# శ్రీరామ శతకము

తిరుకోవలూరు రామానుజస్వామి



శ్రీలేఖ సాహితి, వరంగల్లు

# శ్రీరామ శతకము



గ్రంథకర్త

తిరుకోవలూరు రామానుజస్వామి

శ్రీ లేఖ సాహితీ
5-11-114/4, విద్యారణ్యపురి
వరంగల్
1984

# శ్రీరామ శతకము

తిరుకోవలూరు రామానుజస్వామి

ప్రథమ ముద్రణ ఏప్రిల్ 1984

ప్రతులు : 1000



వెల : 10 రూ॥లు

ప్రతులకు : టి. రామానుజస్వామి
ఇ. నెం. 5-11-~~1114~~ 481/4, విద్యారణ్యపురి
వరంగల్-506 009

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్-500003

ముద్రణ : నటరాజ్ ప్రింటర్స్, చార్ బౌలి, వరంగల్.

# శ్రీరామ శతకము

తిరుకోవలూరు రామానుజస్వామి

ప్రథమ ముద్రణ ఏప్రిల్ 1984

ప్రతులు : 1000

హక్కులు : రచయితవి

వెల : 10 రూ॥లు

ప్రతులకు : టి. రామానుజస్వామి
ఇ. నెం. 5-11-~~114~~ 481/4, విద్యారణ్యపురి
వరంగల్-506 009

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్-500003

ముద్రణ : నటరాజ్ ప్రింటర్స్, చార్ బౌలి, వరంగల్.

# మా మాట

మా సంస్థ ద్వారా 'శ్రీరామ శతకము'ను ప్రచురించుటకు అవకాశము ఇచ్చిన శ్రీమాన్ తిరుకోవలూరు రామానుజస్వామిగారికి మా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

శ్రీమాన్ తిరుకోవలూరు రామానుజస్వామిగారు ఆధ్యాత్మిక ప్రవృత్తి కలవారే కాకుండా ప్రతిరోజు సాయంత్రం భగవత్ సంబంధమైన పుస్తక కాల క్షేపంతో పదుగురికి వాటిలోని రహస్యములను వెల్లడిస్తుండడం నిత్య చర్య. వారికి సంగీతంలోకూడా చక్కటి ప్రవేశం ఉంది. అలాగే జ్యోతిష శాస్త్రము లోనూతగిన పరిచయముంది. తమిళ ప్రబంధంలో కూడా చక్కటి అవగాహన ఉంది.

ఈ 'శ్రీరామ శతకం' ప్రచురించి అందులోని ఎన్నో విషయాలను మీకందించాలనే మా ప్రయత్నం. ఈకావ్యం ఏ కొంతమందికైనా నచ్చిం దంటే అది మా సంస్థ సుకృతం.

పుస్తకాన్ని అందంగా, శ్రద్ధతో ముద్రించి ఇచ్చిన నటరాజ్ ప్రింటర్స్ వారికి మా కృతజ్ఞతలు. ఈ పుస్తకము మీ ముందు అందంగా అచ్చుతప్పులు లేకుండా, మాసంస్థలో ఒకరై హితవరిగా నిలిచి వెన్ను తట్టిన డా॥ సిహెచ్. రాములు గారికి, శ్రీ టి. మురళీధరస్వామి గారికి కృతజ్ఞతాభి వందనములు తెలియజేసుకుంటున్నాం. మా కోరికపై ముందుమాట రాసిచ్చిన శ్రీ శ్రీపెరం బూదూరు లక్ష్మణమూర్తి గారికి మా హృదయాంజలులు.

మా సంస్థ 1977 సంవత్సరములో స్థాపించినప్పటికీని ఇంతవరకు ఏమీ పుస్తకాలు వేయలేక పోయాము. సాహితీ ప్రియులు భుజం తట్టితే మాకు అదేమంత కష్టసాధ్యమైంది కాదు. "సాహిత్యమూ, కళలూ వర్ధిల్లితేనే జాతి జీవిస్తుంది" అనేది ఆర్యోక్తి కదా!

5-11-114/4 సర్వేజనాస్సుఖినో భవంతు

విద్యారణ్యపురి

హనుమకొండ-506 009 "శ్రీలేఖ సాహితి"

# ముందుమాట

శ్రీమాన్ శ్రీ తిరుక్కోవలూరు రామానుజస్వామి గారు "అందుకొనవయ్య శ్రీరామ వందనములు" అను మకుటములో శతకమును విరచించి శ్రీరామాంకితము చేసినారు.

శ్రీరామనుజస్వామిగారు శ్రీవైష్ణవ సంప్రదాయమునకు చెందినవారు. సీస పద్యములందు రచింపబడిన ఈ శతకమునందు వారి శ్రీవైష్ణవ సంప్రదాయాభిమానము స్పష్టముగా నున్నది.

శతక సంప్రదాయము అతి ప్రాచీన మైనది. భక్తి రసప్రధానములైన శతకములెన్నో ఆంధ్ర భాష యందున్నవి. తమ ఆర్తికి, భక్తికి అనుగుణముగా భగవత్కటాక్షము నందు కోరికమై భక్తులు పరవశులై భగవత్కల్యాణ గుణాను సంధానము చేయుట శతక రచన స్వభావము శ్రీ రామానుజస్వామిగారు శతక సాంప్రదాయమున కనుగుణముగా రచనము చేసినారు.

శ్రీరామానుజ స్వామిగారు చిరకాలము ఉపాధ్యాయ వృత్తి నవలంబించి పరశ్శతాధిక విద్యార్థులకు విద్యాదానము చేసి కర్తవ్య నిర్వహణమునందు లోటు రానీక తమవిద్యుక్త ధర్మము నెరవేర్చి పదవీ విరమణ చేసి భగవద్గుణాను కీర్తనము నందు లగ్నమనస్కులైన ధన్యులు. వారి సౌజన్యము, సౌమనస్యము శతక పద్యములందు చోటు చేసుకొన్నవి.

కవిత్వము ధారా శుద్ధి శోభితముగా నున్నది. శ్రీవైష్ణవసిద్ధాంతమును సులభముగా ఈ క్రింది పద్యమున వివరించినారు.

ఈరేడు లోకంబు లీశ్వరాధీనమై
భూతి ద్వయంబంచు బొగడబడియె
దైవంబు మంత్రమాధారమై యుండంగ

భక్తిముక్తులకెల్ల భంగమొదవు
మంత్రమాచార్యుని మహిమకు లోబడి
సిద్ధినందగ జేయు చేతనులను
ఆచార్య కృపచేత హరియే ప్రత్యక్షమై
సర్వస్వదానము శక్తి నొసగు

ఇన్నిటికి మూలమాచార్యుడిష్టతముడు
భాగవతు లెల్లరతనికి పరమహితులు
మూలమిది యన్నిటికి నంద్రు మోక్షమతులు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

భక్తి వినమ్రులైన శ్రీ స్వామిగారు శ్రీరామచంద్రస్వామినిట్లు మనోహరముగా అభ్యర్థించినారు.

శ్రీరమాధిపనీకు సేవజేసెదనన్న
నిన్వీడియుండరు నిత్యులెపుడు
భూరికానుకలిచ్చి పూజింతునన్నను
శ్రీలక్ష్మినిన్వీడి తొలగి పోదు
పట్టుమంచము పరుపు బట్టలిచ్చెదనన్న
పానుపయ్యెను నీకు పాపఱేడు
అర్ఘ్యపాద్యములిచ్చి అర్చించెదనన్నను
క్షీరాబ్ధి నీచెంత జేరియుండు

భక్ష్యభోజ్యము లివ్వరేభక్తవరులు
వేదగానము జేయరే వేల్పులెల్ల
ఈశ నిర్భాగ్యుడను పేదనేమియిపుడు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

శ్రీరామచంద్రస్వామి ఆర్త రక్షణాది గుణములను ప్రస్తావించుచు వ్రాసిన పద్యము హృదయాకర్షకముగా నున్నది.

నేనెంత వేడినా నీకేలదయరాదు
భక్తవత్సల దీన భయవిదూర
నేనెంతబిలచినా నీవేల పలుకవు
కరిరాజు వెతదీర్చు కమలనాభ
నేనెంతతలచినా నీవేల కనరావు
గోపికా ప్రియదర్శ గోపబాల
నేనెందుజూచినా నీ జాడ కనరాదు
ప్రహ్లాదుగాచిన పరమ పురుష

కుబ్జవెతలను దీర్చిన కూర్మిసఖుడ
చింతయత్నను గోపిక చింతదీర్చు
నాథనన్నిదె రక్షించు నళిన నేత్ర
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

ఈ శతకము కర్తయూహించినట్లుగా "నిర్గంధ కుసుమము" కాదు. శ్రీరామచంద్ర పాదార్పణము నందిన కవిత్వము వ్యజిన శైలశతారము భక్తజనులీ శతకము నాదరించెదరను విశ్వాసమున్నది.

శ్రీభూపతి శ్రీరామానుజస్వామి గారికి ఆయురారోగ్యైశ్వర్య శుభోదర్క సంపత్సమృద్ధిని ప్రసాదించుగాతమని ప్రార్థించుచున్నాను.

శు భం భూ యా త్

శ్రీ పెరంబూదూర్ లక్ష్మణమూర్తి
ప్రొఫెసర్, ఆంగ్ల విభాగము
కాకతీయ విశ్వ విద్యాలయము
విద్యారణ్యపురి, వరంగల్లు.

హనుమకొండ
27-5-84

# ము న్నుడి

శ్రీమతే రామానుజాయ నమః

నా స్వగ్రామము పర్లపల్లి. తా.జి. కరీంనగరం. తిరుకోవలూరు వంశములో శ్రీ శ్రీదేశికయ్య, లక్ష్మమ్మ దంపతులకు కనిష్ఠ పుత్రుడను. శ్రీవత్సస గోత్రము, మారణ్ శాఖాభిమానుడను. సిద్ధార్తి నామ సం॥ శ్రావణ శు॥ ౧౪ (1920 క్రీ.శ.)న జన్మించినాను. బాల్యములో విద్యాభ్యాసమంతయు మా నాయనగారి సన్నిధినే జరిగినది. భారత, భాగవత, రామాయణములు, విశిష్టాద్వైత సాంప్రదాయ గ్రంథములే కాక, అమర కోశము, ఆంధ్రనామ సంగ్రహము, జ్యోతిష, వాస్తు విషయ సంగ్రహముతోపాటు సంగీతము (హార్మోనియము కూడ) నేర్చుకోవటము జరిగినది. పదునేడవ యేట పంచ సంస్కారములు, విశేషార్థములు కృపజేసిన దేశికులు శ్రీమాన్ కందాళై శ్రీరంగాచార్యులు, ముక్తవరం శ్రీనివాస దేశికులు. మంత్రతంత్రార్థములు, విశేషార్ధములతో పరమార్థ గ్రంథములను అనగా ఆచార్య సూక్తి ముక్తావళీ, శ్రీ వచన భూషణము, తిరుప్పావై మొదలగు వానిని అర్థయుక్తముగా పఠింప జేసినవారు మా తండ్రిగారే.

పర్లపల్లి, పరిసర గ్రామము పోలంపల్లిలో స్వామి శఠకోపదేశికులు, కాంచీ రామానుజ దేశికులు చరమ స్థలములను దర్శించుకొనుటకు తిరుమల మొదలగు దివ్యక్షేత్రముల నుండి స్వాములు వేంచేసెడివారు శ్రీమాన్ నగుమారు నరహరిస్వామి, మరింగంటి నారాయణా చార్యులు (బుట్టారెడ్డిగూడెం) గారలు ముముక్షుప్పడి, శ్రీవచన భూషణ గ్రంథ కాలక్షేపము లొనర్చుటకు ప్రతి సంవత్సరము మా గ్రామమునకు వచ్చి మాయింటనే నిలచి గ్రంథములను స్రాయించెడివారు. అట్టితరి శ్రీమాన్ మరింగంటి నారాయణాచార్యులు దాసుని యందు అవ్యాజప్రేమతో యాదృచ్ఛికప్పడి, నవరత్నమాల, ప్రమేయశేఖరం, ప్రపన్నపరిత్రాణము, అర్థపంచకము మొదలగు ద్రావిడ ప్రబంధములను పఠింప జేసిరి. నాటినుండి విశిష్టాద్వైత సాంప్రదాయములో మిక్కిలి ఆసక్తిజనించినది. ప్రతి నిత్యము రాత్రికాగానే సాపాటనంతరము ఆచార్యసూక్తి ముక్తావళి, రామా

యణము మొదలగు గ్రంథములను నాచే చదివించి వినుటకు మా మాతాపితరుల్బు ఒత్తిడి చేయుటచే చదువక తప్పనది కాకుండెను. ఈ విధముగా విషయ గ్రహణ మొనగూడుటకు కూడా చక్కని మార్గ మబ్బినది అప్పటివరకు కవిత్వలక్షణ మననేమో, ఛందోలక్షణమేమో తెలియదు. ఉపాధి కొరకు యవన హూణ భాషలతో ఉత్తీర్ణుడనైతిని.

మా గ్రామమందే ప్రైవేటు ఉపాధ్యాయునిగా నియమింప బడితిని. ఆ సమయములోనే ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయిడుగా శ్రీ తిరునగరి వేంకటేశ్వర్లు (నుస్తులాపురం) గారు విచ్చేసిరి. బంధుత్వమేగాక గాఢ మైత్రి ఏర్పడుటచే ఛందోలక్షణములు. కవిత్వ పద్ధతులు వారినుండి నేర్చుకొంటిని. నా సాధనకొంత తోడైనది. వీరి ప్రోత్సాహముచే 1942 సం॥లో కాకతీయ వారపత్రిక వరంగల్లు వారు ఉగాది సంచర్భములో "అవనిశోభ" శీర్షికన నా పద్యములను ప్రచురించి లోకమున చాటిరి. ప్రత్యక్షముగా ప్రోత్సహించిన శ్రీ తిరునగరి వేంకటేశ్వర్లు (నుస్తులాపురం) గారికి పరోక్షముగా ఉత్సాహ వంతుడిగా జేసిన కాకతీయ వారపత్రిక సంపాదకులు శ్రీ పాములపర్తి సదాశివ రావుగారికి కృతజ్ఞతలు. 1950లో మా అమ్మగారు పరమపదించిరి వారిని గురించి అప్పుడు కొన్ని పద్యములు వ్రాసితిని

1958, 59 సం॥లో ప్రిప్రిథమముగా జనగామ బేసిక్ ట్రేనింగు స్కూలు హనుమకొండలో (S.G.B.T.) వెలసినది. శ్రీ శేషం వెంకయ్య గారు మాకు ప్రధానోపాధ్యాయులుగా నుండిరి. వారం వారం నిర్వహింపబడే సాహిత్య వేదికా గోష్ఠిలో నా కవితాఝురి నాలకించి శ్రీ శేషం వేంకయ్యగారు ప్రధానోపాధ్యాయులు నా అర్హతా పత్రములో "కవి"నను బిరుదొసంగిరి. ఉపాధ్యాయ శిక్షణా కాలమందే మా తండ్రిగారు పరమపదించగా తీరని లోటు కలిగినది మనోవ్యాకులత, ఆది వ్యాధులు నన్నాశ్రయించి కొంతకాలము అస్పత్రిలోనికి నెట్టినది. కుటుంబ పోషణ బాధ్యతలు భారమైనవి. అనేక క్లిష్ట సమస్యలు ఎదురైనను అకించిన్యము, అనన్యగతికుడనగు నేను శ్రీ సీతారామ కైంకర్యమును ఏమరక యథావిధిగా జేయుచుంటిని.

ఉద్యోగరీత్యా విధినిర్వహణ కొరకు "కమ్మరిపేట" శివారు వేలేరు గ్రామమునకు బదిలీ అయితిని. నివాస గృహమందు ప్రతిరోజు రాత్రి రామాయణ గ్రంథము కాలక్షేపము జరుపుకొనుచుంటిమి. ఆసక్తిగలవారు వచ్చుచుండిరి. కొన్నిసార్లు సీతాకళ్యాణము, పట్టాభిషేకములుగూడ జరుపుకొంటిమి. పగలు తీరిక వేళల "శఠకోప విన్నపములు" అను గ్రంథమును చదువు చుండగా భగవత్స్తోత్ర కైంకర్యము పద్యరూపముగా చేయవలెనను సంకల్పము కలిగినది. ఒక సీస పద్యము వ్రాసితిని. ఉత్సాహము యినుమడించినది. భగవత్సాన్నిధ్యము జెందుటకు భాగవత మంగళా శాసనమే ప్రధానముగా నెంచి నైచ్యానుసంధాన రూపముగా జన్మ తరించుటకు మార్గము లభించినదని యెంచి వాగ్రూప కైంకర్యముగా ఈ సీస పద్యముల మాలను శేషి దంపతుల కర్పించితిని. ఎట్లు వారు ధరించినను సంతోషమే. నా యీ కార్యక్రమములను దిగ్విజయము చేయుటలో తోడ్పడిన నాసహచరి తాయారుకు ఆశీస్సులు. ఇందుకు పూర్వుల సూక్తులను స్వీకరించినాడ.

మ॥ హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురిచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామ స్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండదయోగ్య దుర్మలిన వత్కాకోల గర్తాకృతిన్ ॥

మ॥ అపశబ్దంబుల గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వపాప
పరిత్యాగము సేయు గావున, హరిం భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు. వీనులన్వినుచు నశ్రాంతంబు కీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్త్వజ్ఞ చింతింపుమా॥ ॥భాగ॥

శతకము సమాప్తమైన తరువాత మిత్రులు సహృదయులు శ్రీ తిరునగరి వరవరస్వామి, తిరునగరి వేంకటేశ్వర్లు (నుస్తులాపురం) గారలు చూచి ముదావహమొంది ముద్రింపించుటకు సలహానిచ్చిరి. గ్రంథములో దోషములుండిన విజ్ఞులు, భక్తులు "బాలభాషణము" అని యెంచిమన్నింతురని అర్థించుచున్నాడ.

1983లో సారస్వత మిత్ర మండలి కార్యకర్తలు శ్రీ దాసరి కృష్ణా రెడ్డి, శీలం రాజేశం, పొట్లపల్లి శ్రీనివాసరావు మొదలగువారు ఆచార్య శ్రీ పెరుంబూదూరు లక్ష్మణమూర్తి (కాకతీయ విశ్వవిద్యాలయం)గారి అధ్యక్షతన ఈ శతక కావ్య గానమును టి.టి.డి. కళ్యాణ మంటపమున ఏర్పరచి పదుగురికి నన్ను పరిచయము చేసిరి. వారికి హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ కార్యక్రమమును టేపు ద్వారా భద్రపరచి ఆటేపు నొసగిన శ్రీ బాలకిషన్‌రావు గారికి కృతజ్ఞతలు. టి.టి.డి. కార్య నిర్వాహకులకు నా అభినందనలు.

ఈ శతక ముద్రణకు కొంత ఆర్థిక సహాయాన్నందించిన మిత్రులందరకు గాఢాభి వందనములు. ప్రూపులు, సలహాలు అందించిన డా॥ సిహెచ్. రాములు, చి॥ టి. మురళీధరస్వామి గారలకు శుభాశ్శీసులు. సకాలములో శతకమును ముద్రించి యిచ్చిన శ్రీ నటరాజ్ ప్రింటర్స్‌వారికి ఇతోధి కృతజ్ఞతలు. ఈ శతకమును ప్రచురించిన "శ్రీ లేఖా సాహితి" వారి అభినందనలు.

ఇట్లు
భాగవత పాదరేణువు
తిరుకోవలూరు రామానుజ స్వామి
(పర్లపల్లి)
ప్రస్తుత నివాసము: విద్యారణ్యపురి, హనుమకొండ (వరంగల్



ఈ శతకము

శ్రీ సీతారాములకు అర్పితము

— తిరుకోవలూరు రామానుజస్వామి



# టి. రామానుజస్వామి

జననం : 1920 (సిద్ధార్థి-శ్రావణ శు॥ ౧౪)

విద్య : H S C., S.G.B.T.
రిటైర్డు టీచర్

సంగీతంలోను, జ్యోతిష్యంలోను ప్రవేశముంది.

అధ్యాత్మిక చింతనలో కాలక్షేపం చేయడం వీరి నిత్య చర్య

# తప్పొప్పుల పట్టిక

| పుట | వరుస | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 3 | హీనమ | హనుమ |
| 5 | 20 | వెప్పించు | మెప్పించు |
| 7 | 14 | కమణా | కరుణా |
| 7 | 21 | వక్షము మందున | వక్షమందున |
| 11 | 13 | నిందించ బగలు | నిందించంగ బలుక |
| 15 | 2 | బన్మ | జన్మ |
| 15 | 16 | కాలమునది | కాలమునకది |
| 18 | 10 | చేతి | చేరి |
| 18 | 17 | ఎచ్చటికేదో | ఎచ్చటికేగెదో |
| 19 | 19 | జాతము | జాత్యము |
| 20 | 8 | క్షీనాబ్ధి | క్షీరాబ్ధి |
| 20 | 14 | నేన | నేను |
| 20 | 19 | మునుం | మును |
| 24 | 11 | హృదాస | హృద్వాస |
| 27 | 6 | దాల్చెను | దాల్చెడు |
| 28 | 18 | ప్రజలకు | ప్రజకు |
| 30 | 8 | రాజ్యమును | రాజ్యరమను |
| 31 | 13 | విరుల | విరులంపి |
| 31 | 13 | తరట | తరించ |
| 32 | 4 | సముద్రము | సంద్రము |
| 34 | 8 | సౌరెచ్ఛ | సౌరేచ్ఛ |
| 34 | 9 | కదలేరు | కదలేవు |
| 34 | 11 | దాల్చ | దాల్చి |
| 36 | 10 | అజ్ఞుల | అజ్ఞుడ |

| | | | |
|---|---|---|---|
| 39 | 16 | వారి | వాని |
| 40 | 14 | యుంటివా | యుంటినా |
| 40 | 16 | బిలిన | బిల్చిన |
| 40 | 23 | దీర్చ | దీర్చి |
| 50 | 10 | బో[illegible] | బోలును |
| 52 | 3 | | తిరుకో[illegible]వ |





# శ్రీమతే రామానుజాయనమః
# శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న
# హనుమత్సమేత
# శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

ఉ॥ శ్రీ రఘురామచంద్ర నిను చిత్తమునందలపోసి పొందరే।
సూరులుతొల్లి మోక్షమును సూరిజనస్త వనీయనిన్ననే।
మారక గొల్చెదెదరమాపతి మమ్ముల గూడ బ్రోవనీ
బారమెగాక నన్యులదె భక్తులపాలిటి పెన్నిధానమా॥

సీ॥ శ్రీరామచంద్ర నాచిఱు విన్నపమువిను
మేదివగ్ధోషమో యెరుక పడదు వా
ఎందు వ్యాకరణ సంబంధ దోషముకద్దొ
ఛందస్సు రీతి పొందెందులేదో
కవుల స్నేహములేని కతన తెల్యగలేను
సత్కావ్య పఠనంబు సలుపలేదు
నీ నామస్మరణంబు నానేరములబాప
సీస పద్యంబుల జెప్పినాడ

తే॥ తప్పులేవైన తెలియక చెప్పితేని
తప్పుదిద్దవటంచును తలచియేదొ
పలికి అంకితమిడితి నీపాదరేణు
నౌటరామానుజునికృతి నందుకొనుము॥

సీ॥ శ్రీభూమినీళాది సీమంతినీరత్న
దేవేరులౌ నీకు దివ్యపురుష
నిఖిల హేయప్రత్యనీక కల్యాణైక
గుణగణంబులు నీకు భువలయేశ
శంఖ చక్రంబులు శార్ఙ్గఖడ్గంబులు
భూషణంబులు నీకు శేషశయన
శఠకోప లక్ష్మణాచార్య వర్యులునీదు
నిత్యులాప్తులు నీకు నిగమ వినుత

తే॥ వివిధ రూపంబులను దాల్చు విశ్వరూప
భక్తజన పోష భవహర పరమ పురుష
నిన్నుజేరితి నాతండ్రి నన్నుబ్రోవు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ చోద్యంబుగా నీటజొచ్చి సోమకుద్రుంచి
మున్వేదముల్దెచ్చె ముదముతోడ
కూర్మావతారమై కోర్కెతో మందరం
బూని చరించ వేయుదధిలోన
వనచర రూపమై వసుధను కాపాడి
రక్కసు ద్రుంపవేయక క్రజముగ
నరసింహ రూపంబు ధరియించి ప్రేమతో
ప్రహ్లాదు గావవే భద్ర చరిత

తే॥ వామనుడవయ్యి బలియొక్క నామ మడచి
రామ శ్రీరామ బలరామనామధారి
కృష్ణుడవు నీవు కల్కి-వికృపను జూడు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు।

సీ॥ పాషండఖండనా పాప విధ్వంసకా
చార్వాకమత దూష సాధుశీల
జైనమతధ్వంసి జంభారి వినుతాయ
బౌద్ధ విధ్వంసక భక్తపోష
శాక్తేయ భంజన సత్సంప్రదాయకా
అద్వైత మతనాశయాది దేవ
కుమత సంస్థాపక కులిశంబవై సాధు
జన రక్షణము జేయు దనుజహరణ

తే॥ చారు గీర్వాణ నిర్ణేత చక్రహస్త
తత్త్వ పురుషార్థ సంపద సత్యగుణద
బ్రహ్మసూత్రాల బహుముఖ ప్రజ్ఞరాయ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ శౌరి సూనుకు మున్ను కలివేళ నుదయించి
తిరువాయిమొజి జేసె నరులు మెచ్చ
ముగురార్యులే తెంచి ముదమొంద జేసిరి
ద్రవిడభాషల ముక్తి తత్త్వమంత
భాష్యకారులు నాడు భాష్యంబు వెలయించి
చేతనోజ్జీవంబు చేయ గలిగె
పెరియాళు వారలు పెరియ వాచ్చాంబిళ్ళ
భక్తి సారులు పెద భట్టరార్య

తే॥ లాది గురువర్యులిమ్మహినవతరించి
చేతనుల దిద్ది వైకుంఠ గతికి చేర్చి
రట్టియార్యుల దివ్యాంఘ్రు లాశ్రయింతు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ|| సర్వరక్షకుడగు జానకీపతియుండ
బ్రహ్మ రుద్రేంద్రుల బట్టనేల
మంత్ర రాజంబిదె మహిత ఫలంబుల దీర్ప
అన్య మంత్రంబుల నరయనేల
సిద్ధ సాధనముయా శ్రీపతే యైయుండ
సాధనాంతర భ్రమ చావదేల
చరమోపదేశంబు శరణమై యుండగ
ఇతరాంతరంబుల యిష్టమేల

తే॥ అన్య శేషంబు నాశంబు యాత్మకెపుడు
సకల కైంకర్య మానంద సౌఖ్యములకు
భాగవత దాస్య కర్తవ్య భోగవిరతి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ|| ఈరేడు లోకంబు లీశ్వరాధీనమై
భూతి ద్వయంబంచు బొగడ బడియె
దైవంబు మంత్రమాధారమై యుండంగ
భక్తి ముక్తులకెట్లు భంగ మొదవు
మంత్రమాచార్యువి మహిమకు లోబడి
సిద్ధి నందగ జేయు చేతములకు
ఆచార్య కృపచేత హరియె ప్రత్యక్షమై
సర్వస్వ దానము శక్తి నొసగు

తే|| ఇన్నింటికి మూలమాచార్యుడీప్సితముదు
భాగవతు లెల్లరతనికి పరమ హితులు
మూలమిది యన్నింటికి నందుగ్రి మోక్షమతులు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ కల్పపర్యంతంబు గల్గు దేహంబని
భ్రమసి చేసితి నెన్నొ పాతకములు
ద్రవ్యార్జనంబె యాదరువు రక్షణమని
మోహించి గడియించి మోసపోతి
ఆభాస బాంధవు లాత్మయుత్తారకు
లనియెంచి దరిజేర్చి ఆశచెడితి
అన్యదేవతలె నాకాత్మ రక్షకులంచు
కొలిచి శాశ్వత గతి కోలుపోతి

తే.। భక్తవరులను దాయంగ ముక్తి నొసగ
శ్రీనివాసుడె కర్తయౌ ననగ వింటి
చేరి నిను వేడుకొంటిని చేయివిడకు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ జానకీదేవి నా సంవేదనం బాపి
రక్షించ వినిపించు రామునకును
మాయమ్మ నీవెప్డు మాతప్పులెల్లను
మన్నించ వినిపించు మాధవునకు
కమలనేత్రినాదు కలుషజాలమడంచి
తప్పించ వినిపించు దాశథికి
లోకమాతా నాదు లోలత్వ మణగించి
లోకేశు నెప్పించు లోకమెరుగ

తే॥ ఇందిరాదేవి మాతల్లి ముందె యుండి
పురుషకారము చేయుము మ్రొక్కులిడుదు
ననుచు ప్రార్థింతు మాయమ్మ నామె ద్వార
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ మంత్రాంతరంబుల మనసు నిల్పితిగాని
తిరుమంత్ర వైభవం బెఱుగనైతి
సాధనాంతరముల సాధింప నెంచితి
సిద్ధిసాధన పొందు చెందనైతి
అన్యయుపాయాల నాశించెదను గాని
నారాయణుని నాత్మ నమ్మనైతి
మనుజమాత్రుల సేవ మమత జేసితిగాని
గురువుల భక్తితో గొలువనైతి

తే॥ ఆత్మవంచన పనులెన్నొయమరజేసి
ఎందు దరిదాపు గానక పొందుగోరి
నిన్నె నమ్మితి నీయాన నిజముగాను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ పంచ సంస్కార సంపన్నుండు గాకెట్లు
విష్ణుదాసుల చెల్మి వేగచేయు
నేను నాదనుటను మానకుండగ నెట్లు
సాత్త్విక సహవాస సౌఖ్యమొదవు
నారాయిర స్తోత్రములు చేయకుండెట్లు
జ్ఞానము ప్రాప్తించు మానసునకు
తత్త్వత్రయంబందు తగు నిష్ఠ లేకెట్లు
ముక్తికాంత వరించి మురిసి పడును

తే॥ ప్రేమ నాచార్య చేపట్టి కామము దిగి
భాగవత ధర్మ దాస్య నిర్భరత నన్ను
ముక్తి నరచేతికిత్తువు మోదమునను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ పతియె నాగతి యంచు సతి చేయుధర్మముల్
సీతా పిరాట్టి తాజేసి చూపె
దాస్యమే విధిచేయదగునను వారికి
దయ లక్ష్మణుడు దాస్య నిరతి
పారతంత్ర్యపు విష్ఠ నరులుండు రీతిని
భరతుండు చూపె సద్భక్తి తోడ
భక్తుల సేవయె భగవాను సేవని
శత్రుఘ్నుడు చూపె సత్యముగను

తే॥ సర్వచేతన సంరక్ష సలుపుటకును
దశరథాత్మజుడై పుట్టి ధరణి నేలి
లోక కళ్యాణ మొనరించు లోకనాథ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ నీలమేఘమువాడు నిడుద బాహులవాడు
కరుణారసము జిల్కు కనులవాడు
వెడద వక్షము వాడు వేద స్వరూపుడు
కమనీయ కంఠంబు గలుగువాడు
కనక రంభాతిరసాక్రురులూరులవాడు
పద్మ వ్రతముమించు పదమువాడు
శ్రీవత్స చిహ్నంబు శ్రీచూర్ణరేఖలు
కరముల శంఖ చక్రముల వాడు

తే॥ వక్షమందున శ్రీలక్ష్మి వాసమొంద
శేషశయ్యను బవళించ శేషజనుల
దయ కటాక్షించునను మాట తప్పుగాదు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ|| నీనామములు సహస్రావీకములు గాన
ఏ నామమున బిల్వ నేర్తునిన్ను
బహు రూపంబులు నీకు భావ్యమై యుండగ
ఏ రూపమని విన్ను నేర్పరింతు
కళ్యాణగుణములు కల వసంతంబులై
ఏ గుణమ్మున విన్ను నెంచుకొందు
సకల లోకాలలో సర్వంబు నీవౌట
యెందు గలవీవని యెరుగ గలను

తే|| క్షితిని నిను జూచు వారేరి చిద్విలాస
మలినమతి నేను విన్నెట్లు దెలియనేర్తు
వచ్చి కాపాడు శరణము జొచ్చినాడ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ|| శైశవంబున దేవ శరణన లేకను
మలమూత్రముల మున్గి మరచుటాయె
కౌమారదశయందుగనలేకనుండెనా
చెడు స్నేహంబులు నన్ను చేరి చెరచె
యౌవనంబున విన్ను యర్చింప కొనకుండ
అంగనా సాంగత్య మడ్డు నిలచె
ముదియందు విన్భక్తి మురిపించలేక నీ
చెడు రోగముల దెల్పి చెదగనాయె

తే|| శ్రీరమానాథ గోవింద శ్రీనివాస
ఎట్లు తరియింతునే దశనెట్లు గొలుతు
వేగవేంచేసి రక్షించు వేదవేద్య
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ|| ప్రకృతి గుణంబులు బాగుగానను జేరి
ప్రకృతి వశ్యుని జేసె ప్రాజ్ఞవినవె
సుఖదుఃఖములు నాకు చుట్టరికంబులై
కలిమి లేములు నన్ను కేలికి చెరిచె
మదము మాత్సర్యంబు మమకార గర్వముల్
కరణత్రయము చేత ఖలుని జేసె
రాగద్వేషంబులు బాగుగా నీడ్వగా
కోపతాపంబులు కోరిచేరె

తే|| ద్వంద్వములు నన్ను నీడ్వగా తపనపొంది
తండ్రి నిను జేరజాలక తలతునిదిగో
వరద గోవింద వామన వాసుదేవ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ|| సంసార రొంపిలో స్తంభంబు కూరిన
ట్లయ్యెను నావిధ మరసిచూడ
శ్లేష్మంబునంబడి లేవనేరక యీగ
తపియించు కరణి నాతపన యయ్యె
కారాగృహంబందు నేరస్థుకైవడి
దేహబాధల తగిలి దీనునైతి
పెనుతుపానుకు జిక్కి పీడింపబడు నోడ
విధమయ్యె యీ దేహి వింతగాను

తే|| ఘోరకృత్యంబు లెల్లను కోరికోరి
చేసి నరకంబు చేరను సిద్ధమైతి
రమ్ము నను గని దరిజేర్చరా మురారి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ॥ శ్రీరమానాయకా చిత్తగించ గదయ్య
వివరింతు నీకు నా విపుల చరిత
మవని నేజేయని యఘమొక్కటియులేదు
బండబూతులదిట్టు దండివాడ
జారత్వ చోరత్వ చంచలత్వపునుడుల్
మాటిమాటికి పేయు మేటిమగడ
పరహింస పరధన పరకాంతలను జేర
బట్టిపీడని జగజ్జెట్టి కలుడ

తే॥ పరుల మేలోర్వ జాలని పాపమతిని
ఘనుల నిందల పాత్రజేయు కపటికులుడ
ఇంక యేరీతిన న్నీవు యేలుకొనెదొ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ విద్యుత్స్వమాన దుర్విషయాను రక్తులై
స్త్రీ సంగమును కోరి చెడుట నిజము
భోగాభిలాషచే భూరి సంపద గూర్చి
వరక దుఃఖము నొందు నరుడు నిజము
బంధువుల్ భార్యయేపరమనువారికి
సంసారబంధంబు సాగు నిజము
పాంచభౌతికమైన పాడు దేహముజూచి
నేను నాదను వాడు నీల్గు నిజము

తే॥ ఇట్టియైహిక మస్థిరమీప్సితముల
దగు నీకను సన్నెప్పుడయనుబోధ
విన్నెనమ్మితి మనమున నీరజాక్ష
అందు కొనవయ్య శ్రీరామవందనములు॥

సీ॥ జన్మంబులెన్నొయీ జగతిలోపలనెత్తి
విసుగెంతయును లేదు వాసుదేవ
అనుభవించెడి కర్మలవియెన్నిశక్యమే
శూలికైనను తమ్మిచూలికైన
నేనుజేసినస్తన్యపానంబునిజముగా
సప్తోదధులమించుసారసాక్ష
ఘోరాతిఘోరమౌ నారకంబులనెల్ల
దుఃఖమంచనకనుదూకినాడ

తే॥ అగ్రజుండను పాపులయందునేను
నిరయమొందగనుంటిని నీరజాక్ష
నీదుభజనమె జేయుచునిన్నువిడను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ పరులనిందించ బిగలు పేర్చితిగాని
నాశేరములజెప్పుకొనగనైతి
విష్ణుదాసులజూచి వెక్కిరించితిగాని
ముక్తులంచనియెంచిమ్రొక్కనైతి
ఇతరులవంచించ సతముగోరితిగాని
ఆత్మవంచకునటంచరయనైతి
పలుదేవతలగొల్చిపాడనేర్చితిగాని
పరమాత్ముడగునిన్నుపట్టనైతి

తే॥ భూరివేదాంత సూక్తుల బొగడనైతి
మాటిమాటికి నినుగొల్వ మరచిపోతి
ఇంకనేవిధి నను బిల్చియేలుకొనెదొ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ|| జూదరులందున జూదరి నైనేను
విత్త వ్యయముజేసి వెర్రినైతి
త్రాగు బోతుల జేరి తెగ త్రాగివదరితి
మానావమానముల్ గాన కెందు
తిండిపోతరులందు తిండిపో తైతిని
భక్షించు విజ్ఞాన లక్ష్యమిడక
జారత్వమున నేను జాణనటంచును
పేరు పెంపుగడించి పెద్దనైతి

తే| పట్టిభద్రుండ నైతిని పాపులందు
లేశమైనను సుకృతంబు లేదునాకు
పతిత పావన బిరుదాంక పట్టి విడుతు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ|| సాధువువలె నేను జనము లందరిలోన
కనిపించుటయె కాని ఖలుడనిజము
ఆచారవంతుడననుచు జెప్పెదగాని
సతమనాచారంబు సలుపు చుందు
నిష్ఠాపరుండను నియతి చాటెదుగాని
కనదురాచార సంగతియె మెందు
వైష్ణవుండని చాట విష్ణు చిహ్నములందు
మాధవుసెపుదేని మదిని గొల్వ

తే|| గోముఖ వ్యాఘ్రమను రీతి కుమతినైతి
మోసగాడంచు నీవెట్లు ముఖముజూడ
గలవు నా తండ్రి వేగమె కలుషమణచి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ||

సీ॥ ఆలుబిడ్డల సాకనవనినే పడుపాట్లు
తలచగభయమెంతో గలుగు నెపుడు
గురుదేవతల భక్తి మరచి వేగమె పోయి
భుక్తి కోసము దుష్టు పొగడనాయె
చనరాని చోట్లకు సంతసంబునజని
చేయగల్గని పనుల్ చేయుటాయె
దాసదాసులసేవ తగదని విడిపోయి
చెడి నీచు సేవలు చేసి చెడితి

తే॥ నుడువరానట్టి మాటలు నుడివినాను
కొలువ రానట్టి కొలువులు గొలిచినాను
అడియనెడ బాయకా శ్రియమందజేసి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ పరవాసుదేవ నా బహునీచగుణములు
వివిపింతు వినవయ్య విసువుగొనక
బ్రహ్మచారి నటంచు భ్రమపడజేసితి
భ్రష్టమానపినంచు బలుకనైతి
నమ్రత్వమును జూపినమ్మ జేసితిగావి
కుటిలుడనవి నేను గొణగనైతి
పావనత్వమ్మెంద్ ప్రకటించితినిగావి
తరచుపాపి నటంచు తలచనైతి

తే॥ ఇట్టి దుర్వృత్తులెన్నియో ఈడ్చియీడ్చి
ఘోరనరక ఫలమ్ముల గుడువనుంటి
గాన దరి జేర్చిదయజూడు కమలనాభ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ కాముకత్వోద్రేకగర్వితుల్ చెడిపోరె
మునుబ్రహ్మ రుద్రులు మోహ మొంది
దేవేంద్రుడాహల్యదేవి గూడగ మేన
పెక్కుయోనులు గల్గి పేర్వమొందె
ఋశ్య శృంగుడు చెడె ఋష్యాశ్రమమ్ములో
వేశ్యలరతుల కావేశమొంది
మునులు ఋషులును రాజ ముఖ్యులు వేల్పులు
స్త్రీ సంగమును కోరి చెడిరి భువిని

తే॥ కామవశులౌచు చెడిరిట్లు ఘనులు మున్ను
నన్ను నీచుని సామాన్య నరునకట్టి
కామమణచగ వశమౌనె కలుషహరణ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ భక్తాంబరీషుని భయము బాపగ చక్రి
దుర్వాసు గర్వంబు దూర్ణమడచె
ధర్మజు రక్షింపధారిణి కృష్ణుడు
శిశుపాలు ఖండించె శీఘ్రముగను
సుగ్రీవుగాపాడ సుజనుడు రాముడు
వాలి గూల్చెను నేల కోలవేసి
ప్రహ్లాదుగావంగ నాహ్లాదియాహరి
అసురుని ద్రుంచెను యవని మెచ్చ

తే॥ భక్త వరులను బాధించు పాపిజనుల
నెన్నడేనియు క్షమియింపవ దీశ్వరుండు
నేడు నాదోషములు జూచి నేనరుష్ణించి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ దశరూపధరుడవు ధర్మమూర్తివినీవు
బహుజన్మధరుడనే పాతకుడను
పతితపావనుడీవు భక్తవత్సలనేను
పతితుండ నీచుడ పాపరతుడ
శరణాగతత్రాణబిరుదాంకితుడవీవు
కాపాడుమన చంపు ఘనుడనేను
కారుణ్యదాక్షిణ్య కల్యాణనిధివీవు
నిర్దయుండనునేను నిందితుడను

తే॥ నీదుబిరుదములట్లుండు నాదుహేయ
గుణములిట్లాట జోడింత కుదురదనుచు
తరిమికొట్టకు దిక్కులేకతండ్రినీవె
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ ఆత్మాభిలాష విన్నవింతునందునా
దేహాభిమానము తీసిపోదు
జ్ఞానభక్తివిరక్తి ధ్యానింతునందునా
కలికాలమునది యలవిగాదు
మనసునేకాగ్రత మనలజేసెదనన్న
ఈషణత్రిబంధమెప్పుడుపోదు
సత్సహవాసంబు సంతరించెదనన్న
దుస్సహవాసమే తోడు పడును

తే। ఇట్టి లంపటు లంబడి తుట్టతుదకు
మట్టిచేపట్టి నోటను కొట్టుకొంటి
గాన పాపిని విడువక కలుషమణచి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ అపరాధు శిక్షించుటదియె నీమతమన్న
దోషభోగ్యుడనన్న దోషమొదవు
పాపాత్ముడనినీవి పారద్రోలెదవేని
పతితపావనతకు భంగమొదవు
అజ్ఞానునకు నీవు హాని జేసెదవేని
వాత్సల్యతకు నెప్డువచ్చు కీడు
శిక్షార్హుడని నీవు చేరదీయవదేని
సౌశీల్యతకు వచ్చు సామి కొరత

తే॥ ఇట్టి కొరతలు వచ్చుట కిష్టపడుదె
యనుచు శ్రీదేవి మిమ్మెప్పుడడుగుచుండు
గానయఘములు జూడక కావుమెపుడు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ వీడల్పుడంచని వీడనాడెదవేని
సౌలభ్యుడంచెట్టు చాటుకొనెదు
అజ్ఞుండుఛండాలుడని వీడవలతేని
సర్వజ్ఞ బిరుదు నిస్సారమగును
వీడకించనుడని విని నూరకుంటేని
భవదీయకీర్తికి భంగమొదవు
ఆర్త పరిపన్నుని యార్తి దీర్చవదేని
శోకహరుడను పేరు లేకయుండు

తే॥ మాధవిచ్ఛెప్పుడును చేయుబోధనలను
చెవికినెక్కించుకొని వేగచేతనులను
కృపను రక్షించు గోవింద కృష్ణవర్ణ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ స్వామీః నీరూపెట్లు చక్కఁగ నమ్ముదు
కలరూపునన్నాకుగాన బడితొ
వందిమాగధులెల్ల వందనంబులుజేయ
గైకొని యుండుట కలను నమ్మ
శ్రీలక్ష్మి నీసేవ చెలగిచేయునటన్న
యెట్లు నమ్ముదు దేవ ఎరుక చేయు
వైకుంఠపురి గొప్పవాసినుండునటన్న
నమ్మసాధ్య మదెట్లు నాకు జెపుమ

తే॥ కాననీ విశ్వరూపంబు కనులనింప
నేల చేసెద వాలస్యమేల చూపు
నాకు నీవైభవంబంత నటనరాయ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ। విజ్ఞానఖనివీవు అజ్ఞాన నిధినేను-
అల్పుడంచని యెంచకాదరించు
జీవోద్ధరుడ వీవు జీవద్వేషిని నేను
హింసాత్ముడన కను హితముగూర్చు
ప్రకృతివిగ్రహుండీవు ప్రకృతి బద్ధుడనేను
పాపాత్ముడన కను పరముఁనిమ్ము
దోషభోగ్యుడవీవు దోషకృత్యుడ నేను
ఛండాలుడన కను క్షమను గాచు

తే॥ తనయునెపుడైన వీడునే తండ్రి యెంచు
సజ్జనుల స్నేహమొనగూర్చి సన్నిధికిని
జేర్చుకొనుగాదె నామొర చెవిని విడుచు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ అర్థపంచక జ్ఞానమమరియుండిన గదా
జ్ఞాన మాత్మకు గల్గు మానకెపుడు
ఆకారత్రియ విష్ణయాత్మకుండినగదా
అన్యదేవతలందు నాసపదరు
నవవిధ సంబంధమును వమ్మునమైన
ఇతరాంతరంబుల యిష్టముడుగు
తత్వత్రయంబాత్మతరచి చూచినగదా
మంత్రాంతరంబులమాని బ్రతుకు

తే॥ భువిని నీయర్థముల యొక్క భోగ్యతెరిగి
చేతివిష్ణలనున్నట్టి చేతనులను
దయను రక్షింతువట తండ్రి ధర్మమూర్తి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ ఏ నామమునబిల్వ నేగుదెంచెదో కాని
శ్రీరాముడని బిల్తు చిరమునేను
ఏ రూపమున నీవు యెట్లగుపడెదవో
శ్రీరామురూపిపై చేయనన్ను
ఏమొరాలించుచు ఎచ్చటికేదో
నామొరాలించుచు నన్నువిడకు
ఏచోట నుందువో యేలికనాసామి
నాగేహమందుండి యేగకెపుడు

తే॥ నేను నీవాడనంచును నిన్నుచేరి
యాశ్రయించితి దాసులయార్తిదీర్చు
అవనినేగోప పురుషార్థమదియె సుమ్ము
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ నాతల్లి దండ్రివి నాయిష్ట దైవమా
నాతోడు నీడవు నాగశయన
నాకర్త భర్తవునా కల్పవృక్షమా
భుక్తి ముక్తి నొసంగు పుణ్యపురుష
నానాథనాయక నాకామధేనువా
రక్ష్య రక్షకభార రమ్యవేష
నాగురుదైవము నాభాగ్యదేవతా
మంత్రార్థ బోధక మాన్యచరిత

తే॥ పరమపదనాథ కృపజూడు పద్మనాభ
నిన్నెనమ్మితి బ్రోవుము నన్నువిడకు
మెల్లవేళల భారంబుచెల్లనీక
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ మంత్రరత్నము నెప్డు మదిలోన ధ్యానించ
బలురోగ సంఘముల్ బాసిపోవు
మంత్రరత్నము నెప్డు మదిలోన ధ్యానించ
ఈషణత్రయభీతిలేక తొలగు
మంత్రరత్నము నెప్డు మదిలోన ధ్యానించ
సంసారబంధమే నమసిపోవు
మంత్రరత్నము నెప్డు మదిలోన ధ్యానించ
అభిజాత్యములెల్ల నంతమొందు

తే॥ మంత్రరత్నమునేనింక మరవనయ్య
నిర్భరత్వమునీయందు నిలిపితయ్య
దాసుకైంకర్యమిదియని తలపవయ్య
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ శ్రీరమాధిపనీకు సేవజేసెదనన్న
నిన్నీడియుండరు నిత్యులెపుడు
భూరికానుకలిచ్చి పూజింతునన్నను
శ్రీలక్ష్మినిన్వీడి తొలగి పోదు
పట్టెమంచము పరుపు బట్టలిచ్చెదనన్న
పానుపయ్యెను నీకు పాపతేడు
అర్ఘ్యపాద్యములిచ్చి అర్చించెదన్నను
క్షీరాబ్ధి నీచెంత జేరియుండు

తే॥ భక్ష్యభోజ్యము లివ్వరేభక్తవరులు
వేదగానము జేయరే వేల్పులెల్ల
ఈశ నిర్భాగ్యుడను పేద నేమియిడుదు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ గజరాజు మొరయిడకాచిరక్షించుట
దబ్బరయని నేనదలతునయ్య
ద్రౌపది మొరవినిదయతోడ బ్రోచుట
కల్లయంచని నెంతు నుల్లమందు
ప్రహ్లాదుగాపాడ వరుగెత్తి పోవుట
అంతహుళక్కియే యందునయ్య
మునుంజటాయువునకు ముక్తినిచ్చుటయన
వట్టిదంచును నెంతు వారిజాక్ష

తే॥ కుబ్జశబరుల నార్తిపోగొట్టుటెల్ల
అదియబద్ధము శ్రీరామయవనినాథ
నేడునన్నుబ్రోవ నవియెల్లనిక్కమగును
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ విత్తమార్జన జేయ వెంగలి నైచెడి
బద్ధాత్ములకు నేను బానిసైతి
జ్ఞానమార్జింపను హీనుండ మతిచెడి
దుర్జనంబులగూడి ధూర్తనైతి
ధర్మార్జనముజేయ ధారిణి గతిజెడి
వేదబాహ్యుల గూడి విఫలునైతి
మోక్షమునార్జింప మూఢునై గురి జెడి
నాస్తికులనుగూడి నాశమైతి

తే॥ పుడమి నెచటను శాంతిని బొందలేక
మాటిమాటికి దోషముల్ మదనపెట్ట
నిన్ను జేరితి నాతండ్రి నన్ను విడక
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ పాదుకలనుగొని పాద పూజలుజేయ
భరతుండగాను సద్భక్తి తోడ
ఇంపుగా సేవలు ఎల్లవేళల జేయ
లక్ష్మణుండను గాను లక్షణముగ
ప్రాణమర్పించియు ప్రాపుగోరగ నేను
అల జటాయువుగాను యమితభక్తి
జపహోమములు జేసి సంతోషపెట్టను
ఋష్యాదులందొక ఋషినిగాను

తే॥ పారతంత్ర్యము చేపట్టి తరచునేను
నిన్నుపొందగ లేనయ్య నీరజాక్ష
దయను నను జేరదీసియు భయము బాపి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ.॥ సాహాయ్యమొనరించి సంతోషమొందించ
సుగ్రీవుడనుగాను సుమ్ము దేవ
సామర్థ్యమునను రాక్షసరాజు వంచించ
రోషమందగను మారుతినిగాను
పేర్మిచే ప్రీతితో విందులు జేయను
శబరిని గానంచు చాటి చెపుదు
శరణంచు నినుగోరి సాన్నిధ్యమర్థింప
సాహసంబున విభీషణుడ గాను

తే.॥ భూరి కైంకర్యములు జేయతరముగాదు
కించిదజ్ఞుని దరిజేర్చు కేలుమోడ్తు
ఆశ్రయించిన దాసుని ఆర్తి దీర్చి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ.॥ పేర్మితో గూర్చుండ పేంచేయగల పేని
హృదయ పీఠమునిత్తు కొదువలేక
కూర్మిచే పూజల గొనగ వచ్చెదవేని
అంజలి పుష్పములమర నిత్తు
పాద్యమింపుగ గొన భ్రమసివచ్చెదవేని
కరమొప్ప కన్నీట గడుగ గలను
వేదస్తోత్రధ్వనుల్ వినగ వచ్చెదవేని
దీనార్తి రావముల్ విన్నవింతు

తే.॥ నాకునున్నంత వావిలో నీకు నిడెద
దయను నేజేయు సేవలు తనివిదీర
గైకొనగ రమ్ము కరుణను గరుడవాహ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ నిన్ను ధ్యానముజేసి నేతరించెదనన్న
నిమిషమైన మనస్సు నిలువదాయె
నిన్నర్చ జేయుచు నే సుఖించెద నన్న
గడియ తీరికలేక గడుపుటాయె
దీపధూపములిచ్చి దేవగొల్చెద నన్న
దుస్సహవాసంబు దొలగదాయె
సద్గ్రంథ పఠనంబు సలుపగోరెద నన్న
పారమొందని నీచపఠనమాయె

తే॥ ఇంక నేరీతి నిన్నాశ్రయించగలను
ఏమితోచక నీస్తోత్ర మెపుడు జేతు
బాలునజ్ఞాని రక్షించు భారమనక
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ హెచ్చు తగ్గులు లేక ఎవరువచ్చిన నేను
మెచ్చెదననుమాట యెచ్చటుండె
మెచ్చుకోలుకు నేను యిచ్చగించనటంచు
ముచ్చటించితివేల ఖచ్చితముగ
మచ్చిక నీరూపు వచ్చి చూపించుము
లచ్చికి జోహారు లెచ్చు తెలుపు
పచ్చవిల్తుని తండ్రి రచ్చకీడ్వకునన్ను
వచ్చి కాపాడుము మెచ్చుననక

తే॥ ఉచ్చదశ వీడి వేవచ్చి నచ్చవయ్య
మచ్చికైనను నిన్వీడ పిచ్చివాడ
లచ్చియానను నీయాన మెచ్చునన్ను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ|| శ్రీరంగపురవాస శ్రీరంగనాయకా
మంగళంబులు నీకు మాన్యచరిత
వేంకటాచలవాస వేంకటేశ్వరసామి
శుభములు నీకగు అభయహస్త
కరిశైలగిరివాస వరదరాజ ప్రభో
కల్యాణములు నీకు కలుషహరణ
జయ యాదవాద్రీశ సంపత్కుమారుడ
జయములు నీకగు భయ విదూర

తే|| భద్రగిరివాస శ్రీరామభజన మిదిగో
యాదగిరివాస నరసింహ అంజలిదిగో
దాసహృద్వాస శ్రీరామదాసునేలి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ| సర్వేశ నీ గొప్ప సౌందర్యమును జూచి
శ్రీలక్ష్మి మైమర్చి సేవజేయు
నవనీత హృదయంబునకు మేటియానన
వక్షస్థలంబందు వాసమొందె
సతి ధర్మమునుదెల్ప పతిని విడువక తానె
సకల కైంకర్యముల్ సలుపునెపుడు
భక్తులు యేతెంచి భయపడి పోకుండ
నిత్యాన పాయియై నిలచియుండు

తే|: జనని జానకి మాతల్లి చనువుచేత
పురుషకారము చేయును నరుల బ్రోవ
దయను శిక్షింతో రక్షింతొ తరిమి కొడుతొ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ॥ నారాయణునకు తానెనరున కొసంగెను
మంత్రరాజము మున్ను బదరియందు
ద్వయమంత్రమొసగెను వైకుంఠపురమందు
పెరియ పిరాట్టికి ప్రేమ తోడ
చరమంబు కృపజేసె కురుక్షేత్రభూమియందున
పార్థుండుదీను దైన్యముతోజేయ
తత్త్వత్రయంబిట్లు తానె యాచార్యుడై
వివిధస్థలంబుల విశదపరచె

తే॥ గురువునీమంత్రముల నెల్లకోర్కెనీయ
భక్తిభజియించు వారికిముక్తిగలుగు
ననుచుబోధించు యాచార్యుడీవె గాన
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ నేనెంత వేడి నానీకేల దయరాదు
భక్తవత్సల దీన భయవిదూర
నేనెంతపిలచినా నీవేల పలుకవు
కరిరాజు వెతదీర్చు కమలనాభ
నేనెంతతలచినా నీవేల కనరావు
గోపికా ప్రియదర్శ గోపబాల
నేనెందుజూచినా నీ జాడకనరాదు
ప్రహ్లాదుగాచిన పరమ పురుష

తే॥ కుబ్జవెతలను దీర్చిన కూర్మిసఖుడ
చింతయంత్యను గోపిక చింతదీర్చు
నాథనన్నిదె రక్షించు నళిన నేత్ర
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ తప్తచక్రాంకముల్ దాల్చనినరుదెట్లు
వైష్ణవుండని పేరు వసుధ గాంచు
అర్థపంచకవిజ్ఞ యాత్మకు లేకున్న
కమలనాభునిభక్తి గలుగునెట్లు
భాగవతాచార్యభక్తి గొల్వకనెట్లు
భగవంతు కృపనిందు బడయగలడు
శ్రీవైష్ణవులసేవ జేయక యదియెట్లు
వైకుంఠ పురమందు వాసిగాంచు

తే॥ భువినియాచార్యకృప నిందు బొందెనేని
రక్తి భగవాను డెట్లైన ముక్తినిచ్చు
తామెయాచార్యులై నన్ను దయను బ్రోవ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ ప్రారబ్ధములుమెందు పాపకర్మలుమెందు
దరిజేరు విధమది దయను జూడు
బలురోగములు మెందు బహువిఘ్నములుమెందు
పలు బాధలెల్లను బారద్రోలు
దుస్సంగతులు మెందు దుర్మార్గములు మెందు
దురిత జాలములెల్ల తొలగగొట్టు
ఖలుల కూటమి మెందు కలి దోషములు మెందు
కనరాదు నీరూపు కన్నులకును

తే॥ మనసునిలువదు నీయందు మమతపోదు
చిత్తమేరీతి నీయందు జేర్చగలనొ
నన్నుపీడకు నిన్నెద నమ్మినాడు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ సరసిజ నయనుండు శంఖ చక్రధరుండు
దివ్య సుందరమూర్తి దేవ విభుడు
దరహాస వదనుండు యురమందు శ్రీవత్స
చిహ్నంబు గలవాడు శ్రీధరుండు
రత్న కిరీటంబు రమణీయముగ నొప్ప
శిరమున దాల్చెను శ్రీ సఖుండు
కనకంపు చేలంబు గట్టుచుండెడి వాడు
మేఘవర్ణముబోలు మేను వాడు

తే॥ అభయ హస్తమునిడు తన యాశ్రితులకు
పాదపద్మములను జూపి భయము బాపి
నేడు నను రక్ష సలుపంగ నిలచి నావు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ పాపంబులను జేసి పరితపించుట యేల
పతితపావనుడు తా పాపుగాగ
కర్మంబులనుజేసి కడు దుఃఖ పడనేల
కలుషంబులను బాపు ఘనుడు గలుగ
రుజ బాధలంజూచి రోధించ నది యేల
రంజించు జానకీ రమణుడుండ
ఆలుబిడ్డలజూచి అలమటించుట యేల
ఆవేదనల బాపు హరియెగాన

తే॥ చిత్తమా నీవు దుఃఖంబు జెందుటెల్ల
అంతరాత్మలో హరి యుండి ఆదుకొనును
నేడు నాబాధలను దీర్చ నిన్నెగొలుతు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ శ్రీనివాసా నాకు క్షితియందు నెప్పుడు
నీ నామ స్మరణమే నిత్యమొసగు
శ్రీవల్లభాయంచు చిత్తంబులోపల
ధ్యానముండెడి రీతి జ్ఞానమొసగు
వరద దామోదర పరమాత్మయనగను
నీ కీర్తనము జేయ నియతినొసగు
నారాయణాకృష్ణ నామంబులను గొని
భజనంబు చేయగ భక్తినిమ్ము

తే॥ మధురమై యుండు నీనామ స్మరణ మెపుడు
నాథ దయచేయు సతతము నాకు నెపుడు
పతితపావన బిరుదాంక పరమ పురుష
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ కమలాలయే భార్య కమలాసనుడు బిడ్డ
దివిజులెల్లరు నీదు సేవకులను
వేదపురుషుడు నిన్నే విధంబుల గొల్చు
పార్థుండు నీప్రియ బాంధవుండు
తల్లియే దేవకి దయయె మోక్షంబంద్రు
ఈ జగత్తే మాయ యిలను ప్రజలకు
నీమాయ తెలియంగ నేనెంతవాడను
మహిమతెలియగ లేరు మాన్యులైన

తే॥ నీ కృపాలేశమెంతైన నిలచియున్న
ప్రకృతి నెడబాపి నిన్నింక మరువగలనె
దాతవై నన్ను దరిజేర్చు ధర్మపరుడ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ జన్మమేదెత్తిన జగతిలోపల నేను
భక్తిహీనుల చెల్మి భక్తి జేయ
ఇంపుసొంపుల నందు యేకథలైనను
వినజాల నీకథల్ వినగ గలను
పాషండులను జూచి పారిపోయెదగాని
వినుదలంపని వారి నేనుగోర
నీపూజలేజేసి నీకథాశ్రవణముల్
గోరెడివారి నే గోరుచుందు

తే॥ వినుము భవదీయ దాసులలోన నన్ను
కట్టకడపటివాడని కరుణజూచి
దాస్యమింపుగగొనవయ్య తండ్రినీవు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ నీయందు చిత్తంబు నిలుపనేర్వనివాడు
ఏ వేదములనేర్చినేమి ఫలము
చిత్తంబు నీయందు జేర్చకయజ్ఞాదు
లొనరించ ఫలమేమి మానవునకు
మాధవనీయందు మనసు లేకొనరించు
పూజలు దానముల్ పూజ్యమగును
హరియందు చిత్తంబు యమరకచేసెడి
గంగాది స్నానముల్ భంగమగును

తే॥ మాధవునియందు చిత్తంబు మరులుకొలిపి
చేయుకర్మంబులెల్లను సిద్ధివందు
నేనశక్తుండని విజేయ నిజముదేవ
అందుకొనవయ్య శ్రీరామవందనములు॥

సీ॥ రాక్షసిదునుమాడి రాక్షస వికృతిని
గావించు రవికుల ఘనయశుండ
కపిరాజు ద్రుంచియు కపిరాజు గైకొని
కపిరాజ్యమొసగిన కపికులుండు
చాపంబు ఖండించి చాపంబు చేపట్టి
శత్రుసేనల ద్రుంచు క్షాత్రవరుడు
అసురేంద్రు దునుమాడి అసురేంద్రునకు
రాజ్యమును విప్పించినరాచకులుడు

తే॥ శబరి దయజూచి కాంక్షించు శబరునెప్పుడు
గ్రద్దఱేనికి మోక్షంబు కూర్మినొసగు
రక్షకుడవెల్ల వారికి మోక్షమొసగ
అందుకొనవయ్య శ్రీరామవందనములు॥

సీ॥ ధర్మంబులిడుమని దయను నేగోరను
కామ్యంబులొందను కాంక్షలేదు
అర్థించగనులేను యర్థంబువిమ్మని
మోక్షమిమ్మంచును ముదముగోర
దృఢకాయమిమ్మని దృఢముగా నేవేడ
తపసి కావలెనను తపన లేదు
సతతంబు నీనామ స్మరణమేజేయుచు
గలిగినకాలంబు గడపుటకును

తే॥ కోరుచుండెద నామది కూర్మితోడ
ఇంతమాత్రమె నొసగను పంపమేల
కూరుడని యెంచినామీద కోపపడక
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ మాధవుడేడని మతి మాంద్యుడడిగిన
మాట యేమనవలె మాన్యచెపుమ
నరహరి యేదని నాస్తికుడడిగిన
నాథ యేమనవలె నాకు నుడువు
బౌద్ధజైనులువచ్చి భగవంతుడేడన
ప్రత్యుత్తరము నెట్లు పలుకవలెను
యవనహూణులు జేరి హరియెందుగలడన
ఏమని జెప్పుదు యెరుగజేయు

తే॥ నిజమునీరూపు నీయునికి నిలుకడెచటొ
వాస్తవముదెల్పి నాస్తికవాదముడుపు
నీదెఖాకంబు విన్నమ్మి విన్నెగొలుతు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ చెట్టునై విరుల సేవజేసితంచ
పూర్వపుణ్యంబులు పొసగవేమొ
బండనై గుడియందు బడియుండి తరియించ
పూజచేయగలేనా పూర్వమందు
గడపనై నీరూపుకనుచు సంతోషించ
నోమునోచగ లేదొ కమలనాథ॥
పక్షినై యెదుటను పాటలు పాడంగ
అదృష్టరేఖంచు యమరలేదొ

తే॥ మనిషినై యుండి నీయందు మనసులేక
మానవత్వము విడనాడి మరపుజెంది
చపలుడౌటను నీసేవసలుపలేను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ భక్తులు నీపాదపద్మముల్ విడరంచు
నెగసిపోయెది పక్షినెక్కినావు
నీసేవకులు చుట్టువిలచి పోదురటంచు
పాలసముద్రమువందు వెలసినావు
దాసదాసులు విన్నుతలచి విడువరటంచు
పాముపై నీశయ్య పరచినావు
భృత్యులు వినుజేరి పీడింతురని యెంచి
పరమ పదంబున కరగినావు

తే॥ భక్తజన పోషణ్యాయంబె వరుగులిడగ
దీనజనులకు తెరువేదొ తేటపరచు
ఇంకవినువీడి మనలేను పంకజాక్ష
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ శ్రీలక్ష్మి సీతమ్మ సిరులమేటి గదమ్మ
చిన్న నీకొమరుని చేరవమ్మ
అలగావరివాని నాశ్రయించితినమ్మ
అడవి ద్రిమ్మరి నంచు వీడకమ్మ
అపరాధిరక్షించుటది స్త్రీకెతగునమ్మ
మాధవు వినిపించు మాతవమ్మ
ఆత్మలాక్రోశించ నదియెట్లు వినెదమ్మ
ఆర్తిని పోగొట్టు మూర్తివమ్మ

తే॥ దయకు నేకేరుసాటి యౌదార్యలమ్మ
భర్తనెడబాయకుండెడి పతతివమ్మ
తల్లిదండ్రులు మిమ్మింక దరమ విడను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు।

సీ॥ మేనెల్ల కృషియించె మేధ తొలంగెను
ధైర్యమ్ము వమ్మయ్యె తండ్రినిజము
మనసునిల్కడతప్పె మరపువాటిల్లెను
జవసత్త్వములు క్రుంగె జనకనిజము
ఇంద్రియంబులు సొలెఇరవు మీరుచునుండె
నవనాడులవిక్రుంగె నాథ నిజము
ప్రాణముల్ చలియించె పసనుపోగొట్టెను
ధీరత్వమది తగ్గె దేవ నిజము

తే॥ చెప్పరానట్టి బాధలు చేరె నిజము
అలసించిన ప్రాణముల్ అవిసిపోవు
దిక్కులేనట్టి నాకింక దిక్కునీవె
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ కౌసల్య రామన్న కరుణించవేయన్న
కఠినాత్ముడవుగావు కదలవన్న
మమునీవు శిక్షించ మారాముతగదన్న
మంకు పట్టివి నీవు మానవన్న
పాలు పెరుగు దిన్నపసివాడవౌదన్న
విశ్వరూపంబెట్లు నెలయునన్న
మా దోషములు యెంచి మదినుంచుకోయన్న
మాపాల నెనరుంచి మరువకన్న

తే॥ వెన్నగాదొక నీమది నన్ను గన్న
చిన్నవాడను నన్నేలు పున్నెమున్న
కన్నతండ్రివి నీకన్నగాన మిన్న
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ ముందుమాలాకారు దందంబుగానిచ్చ్చు
విరులదండలు నీవువేగ గొనవె
భక్తితో కుబ్జిచ్చుబహు పూల దండలు
కామించి గైకోవె కాంక్షతోడ
అండాళుముడిచిన హారంబులవిగొని
భోగ్యంబుగా మేనబూనలేదె
తొండరడిపొడితో మాలలీయగా
తిరుమేను సొరెచ్చ దేవగొనవె

తే॥ దాసుకడలేదు సౌగంధి దామములును
ప్రేమయంజలి దామముల్ పెక్కుగలవు
దాచియుంచితి దయతోడ దాల్చిమేన
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ కౌసల్యదేవకి గర్భంబులానీకు
చెరసాలలాయెనా చిట్టి తండ్రి
మధురలో కంసుడు మామయేర్పరచిన
చెరసాలెపుట్టిల్లు చిట్టితండ్రి
కాంతల కౌగిళ్ళ కఠినబంధములౌచు
చెరసాలలాయెనా చిట్టితండ్రి
భక్తుల హృదయాలె పరమాత్మనీపాలి
చెరసాలలాయెనా చిట్టితండ్రి

తే। వింతవింతల చెరసాలలంతుదెలిసి
నాదుహృదయమ్మె చెరసాలనవ్యమనుచు
చేరిసంతృప్తి పూజలదేరి తండ్రి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ శ్రీరామ నీయండ చిరకాలముండంగ
తాపముల్ లేకుండు ధరణినిండ
పతితపాపనుదండ కైదండ నాకుండ
పాపపిండులు నన్ను పాయునండ
దండిదాతనుజేరు తనయుండ దాసుండ
తండ్రియైరక్షించు ధార్మికుండ
కోదండ మెక్కిడి కూరిమి కాపుండ
మా బాధలిక తీరు మనసునిండ

తే॥ మాకు సిరులిచ్చి రక్షించు మాధవుండ
గానము నేనిచ్చు పూదండ మేను నిండ
నిండు హృదయంబు నాయందె నిలచియుండ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ వేమారు వేడిల్ల వినవెందుకీ కక్ష
వినిపించుకోవేల దీన రక్ష
జన్మంబులికనెత్త జగతి జాలున కాంక్ష
కమలాక్ష మాకిది కఠిన శిక్ష
భక్తుల రక్షించు పనియైన యీ దీక్ష
పక్షివాహన నీకు బహు యపేక్ష
నీమూర్తి కనుపించ నిజమునాకిదె భిక్ష
సరియైనదని యెంచ సారసాక్ష॥

తే॥ కుక్షి నీయందు నరులుండు కోటిలక్ష
వానినేవిధి రక్షింతొ వారిజాక్ష
దాసు రక్షించుటది యొప్పు ధర్మదీక్ష
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ వేదపురుషుండెల్లవే దంబులకుబాడి
విసిగెను నీయంతువానిగనక
ద్రావిడామ్నాయముల్ తనివితీరక పాడి
ఆళ్వార్లు విసిగిరి యంతుగనక
తిరుపాణిత్యాగయ్య తిరునామములు పాడి
విలిచిరి నిన్గొల్చునేర్పుగనక
వాల్మీకి పోతన వ్యాసులు వినుపాడి
అంతుగానకవీదిరంతుగనక

తే॥ వైభవము నీదువ్యాఖ్యాతివశమె తెలియ
అల్పుడనుదేవ అజ్ఞుల అలసుకాడ
చిన్నపాటల మెచ్చుచు నమ్మవిడక
అందుకొనవయ్య శ్రీరామ వందనములు ॥

సీ॥ పుణ్యముల్ జేసిన పురుషుండు స్వర్గము
నంది భోగంబులననుభవించు
పాపకర్మలుచేయు పాపులు నరకము
చేరిదుఃఖంబుల చేటువొందు
పాపపుణ్యంబులు పరగజేసినవాడు
భువియందు కర్మేచ్ఛపుట్టుచుండు
జన్మపరంపరల్ జగతిగల్గిననేమి
మదిలోన చింతించు మాటలేదు

తే॥ చిత్తమెప్పుడు నీయందుజేర్చియుంతు
మనసు విస్వీడకుండగా మరులుగొనును
చిరమునీనామ స్మరణంబె చేరికొలుతు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ వరద నారాయణ వాసుదేవ ముకుంద
గజరాజు మొరలిడగావ జనవె
గోపాల మాధవ గోవింద నరసింహ
పాంచాలి రక్షించ పరుగులిడవె
దామోదరా! కృష్ణ! దశరథ నందనా!
శబరివిందులగోరి చనగలేదె
వేంకటేశ జనార్దనాంకిత ప్రియవేష
రాతి నాతిగజేయ ప్రీతి జనవె

తే॥ భక్తులింకెందరో యిట్లు భజనజేయ
వేసములమార్చి మదిని ప్రయాన పడక
కరుణ రక్షించవే నన్ను గాంశ్రబోవ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ కనుగొందునా నీదు కమనీయ రూపము
కనుల పండువుజేయ కమల నాథ
విందునా నీదివ్య వేదాంత సూక్తులు
శ్రవణేంద్రియంబుల శ్రమదొలంగ
దర్శింతునా దేవ ధర్మమూర్తిని నిన్ను
మదిలోని మమత తన్మయమునొంద
పూజింతునా నిన్ను పూలమాలలచేత
కరముల కండూతి కదలిపోవ

తే॥ పరమపదనాథ వైకుంఠపురవిహార
శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గహస్త
ఎన్నడెట్లుద్ధరింతువో యేమొ స్వామి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ బ్రహ్మంబునెరుగుట బ్రాహ్మణ విధియని
ఉపనిషత్తులు దెల్పు నుర్వియందు
క్షాత్రంబుతో క్షితి క్షత్రియుల్ పాలించ
విధియని దెల్పదే వేదమెపుడు
వాణిజ్య కృషి యెల్ల వైశ్యుని విధియంచు
తెల్పవా గ్రంథముల్ దెప్పరముగ
అగ్రజాతులసేవ అవనిలో విధియని
చూపించు శాస్త్రముల్ శూద్రులకును

తే॥ భగవదాచారక వైష్ణవ భక్తి యొకటె
వైష్ణవునకుండు చెడకుండ వసుధ నెపుడు
ననగవిని వైష్ణవుల దాసుడైతినయ్య
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ వెరపించి వస్త్రాపహారంబు గావించు
బ్రహ్మదేవుడు మున్ను భంగపడియె
కాంక్షించె మోహిని కాముకత్వముదీర
సిగ్గుచే రుద్రుండు చింతనొందె
నారదుండానాడు నారిరూపంబొంది
బహునందనులగని బాధ జెందె
మానభంగము చేయ మానిని సభకీడ్చి
దుర్యోధనుడు సుక్కె తులువ యగుచు

తే॥ వేల్పులింకెందరో నీదు విశ్వరూప
మెరుగలేరనుచుండ నేనెరుగుటెట్లు
నన్ను దాసుని బ్రోవుము సన్నుతింతు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ|| రామ నీ రెండక్షరంబులు జపియించి
వాల్మీకి మోక్షంబు వాసిగాంచె
ఖట్వాంగుడను వాడుకడుమోద మందుచు
హరిని జపించుచు పరముగనెను.
నారాయణాయని నందనుకా స్మరియించి
ఆ యజామీళుడు హరిని జేరె
సభలోన శౌరివిస్మరియించి ద్రౌపది
అక్షయంబుగ వల్వలందుకొనెను

తే.| ఎందరెందరో మహనీయులిట్లువిన్న
యెప్పుడెప్పుడు పిల్చినప్పుడపుడె
పలికిరక్షింతువన విని దలతునిన్ను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ విష్ణుభక్తియులేని విప్రవర్యునినైన
శూద్రుడంచును శాస్త్ర సూక్తి నుడువు
విష్ణుభక్తియుగల్గు వేదేతరునినైన
విప్రుడందురు వారి విమలులెల్ల
ఏవర్ణజుండైన యేకులజ్ఞునినైన
విష్ణు గొల్చినవాడె వైష్ణవుండు
శ్రుతులును స్మృతులితి హాసములీరీతి
ఘోషించు నెప్పుడు గురుతరముగ

తే|| వర్ణ హీనులు బాలురు వనితలైన
భక్తి నారాయణుని గొల్వ ముక్తి బడయ
నర్హులంచును వినమె నన్నర్హు జేయ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ బాల్యమందున నన్ను బహు ప్రేమగాపాడి
దయను రక్షించిన తండ్రివీవె
విద్యయు నేర్వంగ విమలుల స్నేహంబు
మటియిల్లజేసిన కాంతుడీవె
అధ్యాపకుని వృత్తి యమరనిప్పించియు
పాలించగలిగిన ప్రభువు నీవె
సంగీత సాహిత్య సారస్వతములిచ్చి
పేరు రప్పించిన పెద్దవీవె

తే॥ ఇట్లు నన్నెందుబాయక యింపుగాను
గుండె ధైర్యము గలిగించి కుందుదీర్చి
నేటికివి రక్ష సలిపెడి నీరజాక్ష
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ శైశవ దశనుండి సామి నేనెప్పుడు
విస్మృతి యుంటివా నిజముగాను
బాల్యమందైదేండ్ల ప్రాయమందేయుండ
ననుజేరదీసిన నాథుడెవరు
యౌవనంబున నేను జవ్వనిగూడుచు
వెంగలినై నిన్ను విడిచినానె
పలుబాధలందున బహునేర్పుతో నన్ను
రక్షించితివిగాదె రంగుగాను

తే॥ చాటుగనుయుండి రక్షణ చేయు నీవు
నేటికివి చూపవదియేమి నీదు రూపు
దీన జనులకు కాంక్షను దీర్చవేగ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ సంసార సంద్రమే హింసాకరంబయ్యె
దరిదాపు లేక నే వెరపుగొంటి
ఈషణత్రియ సుళ్ళ భీషణంబుగ జేర
పంచేంద్రియంబులు పట్టు దప్పె
తాపత్రయాదులు తాపమొందించగ
ప్రకృతి బద్ధుడనౌట వికృతినైతి
మునుగుచు తేలుచు మోహమందుచు దేవ
ఘోర మంచరచుచు మోదుకొంటి

తే॥ చక్రభ్రమణంబు నందిట్లు వక్రగతిని
వేదనల నిండి వినుగన వేదవేద్య
సన్నుతించెద విదె వేగ నన్ను బ్రోవ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ జీవుండు కర్మలు జేసి జన్మల నెత్త
తల్లి గర్భము లోకి తరచు వెడలు
రక్త మాంసంబులు రక్తితో నటగుచ్చి
గర్భాద్యవస్థల గడుపు వేళ
భగవాను ధ్యానించి పలుమరు చింతించు
నవమాసములు నిండనవని పుట్టి
బాల్య యౌవన వృద్ధ భావి జీవితములొ
అజ్ఞాన వశ్యత నంధు డగుచు

తే॥ చేయరానట్టి పనులెల్లజేసి తుదకు
కాల కింకరు బాధల తాళలేక
వరద శ్రీవేంకటేశంచు మొరలు పెట్ట
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥



సీ|| స్థిరము గాదీ జన్మ చిరకాల ముండంగ
ఎప్పుడు మరణంబో చెప్పలేను
గ్రామమందో లేక గహన మధ్యంబునో
జలములందో లేక తలమునందో
అగ్నియందో లేక యానామ మందునో
గుట్ట చెట్టులుగాక పుట్టలందో
పగటియందో లేక పాడు చీకటియందో
పడిపోవు దేహంబు పసను విడిచి

తే|| దేవ మరణంబు వచ్చుట తెలియలేను
స్మరణ మాత్రము నీయందె స్థిరతనుందు
పుండరీకాక్ష నీవాడ బ్రోవు మెపుడు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ|| కంఠంబునందెప్పు కఫమునిండగ బాధ
గురగుర ధ్వనులవి గుర్తుగొనను
ఆలుబిడ్డలు జూచి యయ్యయోయని యేడ్వ
ధ్యాసలేకెంతయు దలపనిన్ను
జనులాస వీడ్కొని చనిపోవు నంచేగ
కనరాదు నీరూపు కన్నులకును
యమదూతలీ యాత్మ ఎడము చేయనురాగ
నిను దలంచెడి శక్తి నిలువగలదె

తే| చెప్పలేనన్ని బాధలు చివర చేరి
నరకముల పాలుపడ జేయునాథ నిజము
గాన కీర్తింతు నిప్పుడే కమలనాథ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ॥ దీన రక్షక దేవ దీన దయాళువ
నీ నామ స్మరణంబె నేను జేతు
పుడమి యందేమి యేభువనమందున్నను
నరకమందున్నను నళిన నాభ
స్వర్గమందున్నను వైకుంఠమునన్నున్న
పాతాళమందున్న పద్మనాభ
ఎచట నేనున్నను ఇసుమంత భయమొంద
నిన్నే స్మరించుచు నిలువగలను

తే॥ పాపి జారుడు చోరుడు పరమ నీచు
డంచు మదినెంచి యెడబాయ నెంచితేని
పాదములు రెండు గట్టిగ పట్టుకొనెద
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ అపరాధి వాయసుండంఘ్రులంటిన నాడు
రక్షింప లేదహో రామభద్ర
శిశుపాలు దోషముల్ చెప్పరానివి యైన
క్షమియింప లేదహో చక్రహస్త
పాపిష్ఠ్య జామీళు పాపముల్ తొలగంగ
పారదోలిన కృపాకర మహాత్మ
పాంచాలి సభ కీడ్చి భంగంబు గావించు
కురురాజు నేలపే కూర్మి తోడ

తే॥ పాపులైనను వీరెల్ల బాగుపడిరి
పచ్చి పాపంబు నేజేసి వచ్చినాడ
నీచుడను నన్ను గాపాడ నీవె దిక్కు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ నీ సృష్టి జాలంబు నీకొక వింతయా
పృథివి నీకిది యెంత పేద రజము
జలధులన్నియు నొక్క జలబిందువన నొప్పు
రవి తేజసంతయు మిణుగురు బోలు
వాయువే నొక యూర్పువలె నుండునేగాని
అభ్రమే రంధ్ర మట్లమరుదేవ
బ్రహ్మాది దేవతల్ బహు సూక్ష్మ జీవులై
విశ్వమందుండును వివిధ గతుల

తే॥ వైభవము నీదు వర్ణింప వశముగాదు
ఏరు నీ వైభవముగన్నవారొ వారి
వారివారివి గొలిచెద వసుధ నెపుడు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ కరములారా మీరు కమలాక్షు నర్చించి
భజనంబుజేయుచు బాగుపడుడు
నేత్రంబులార యా నీరజాక్షుని రాము
కనులార జూచుచు కనుడుసుఖము
వీనులారామీరు వేదాంత వేద్యుని
విమల చరిత్రంబు వినుడుసతము
మననమా నీవింక మాధవు స్మరియించి
గలిగిన కాలంబు గడుపు సుఖము

తే॥ పాదములు మీరు పరమాత్మపదము లంట
పరుగులిడరండు పాపంపు భయము ద్రోల
భక్తజనులను రక్షించు భవ్యమూర్తి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ కాయంబు నమ్మంగ నాయంబె నరునకు
పాయును భువియందు పాయ ఋణము
హేయంబు సంసారకామంబు నిక్కంబు
ఆయాసమధికమౌ యాత్మకెపుడు
ధ్యేయంబుయాత్మకు దివ్యంబు స్థిరమౌచు
పారాయణము రామభజన మెపుడు
సాయంబు నాకౌ నుపాయంబుమదిజూడ
నారాయణుడె రక్ష నయముగాను

తే॥ వీయపాయంబులేదింక యిలను నాకు
ఆ దయాళుని యెడబాయ ననవరతము
తంత్రివైరక్షసలుపంగ దగుదువీవు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ వింత నామారీచు వేయామదల గొట్టి
ఘనమదాకపిరాజుగాచుటెంత
పంత మాచుపనాతి పాపినిద్రోలుట
గొప్ప నా పూతన గూల్చుటెంత
తంత్రమాజలరాశి దాటగ నదియెంత
బాధ యాజానకి బాయుటెంత
ఎంత యాశబరిని చిరకాలమున బ్రోవ
పేర దారుక్మిణి పెండ్లియెంత

తే॥ వింతలును గొప్పలివి కావు కొంతలౌను
పంతముతో నన్ను రక్షించ పాటుబడిన
సుంత యికలేదు ఘనుడవు శూరుడవును
అందుకొనవయ్య శ్రీరామవందనములు॥

సీ|| దీనదయాళుడ దివ్యస్వరూపుడ
నా మొరాలించవా నళిననేత్ర
దారసుతాదులుదారమౌ సంకిళ్లు
ఆభాసబాంధవు లాప్త వరులు
చుట్టాలు శత్రువుల్ సట్టేట నక్రముల్
అగ్రజుల్ భగినులు యుగ్రకరులు
సంసారసంబంధ సంశ్రిత మానవుల్
శార్ధూల శునకాది సర్పసములు

తే॥ ఘోరముగ మీదలంఘించి గోడుగుడవ
జేయుతరి దుష్కృతయుగూడి చేయుకీడు
గాన ననుగావు కల్యాణకర మహాత్మ
అందుకొనవయ్య శ్రీరామవందనములు॥

సీ॥ మన్మథా నను నీవు మరులుగొల్పెదనంచు
గర్వించి వేధించకను తొలంగు
శివుని మూడవకన్ను చిచ్చుచే నీకైన
శాస్తిని గుర్తించి చనుము వేగ
వినవేవి నీకిదె విష్ణుచక్రమువచ్చి
రూపురేఖలుమార్చి రూపుమాపు
భక్తులబాధించు పాపులు వెంటనే
ఘోరమౌనిరయాన గూలగలరు

తే। అభయ హస్తుడు మాధవుడండ యుండ
మాకు దైనను హరుడైన మర్పిందు నిజము
గాన నాతండ్రి యెడబాయలేను నిన్ను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ॥ నింగిని రిక్కలు నీ యాజ్ఞమీరక
పరివేష్టనము చేయు పరిధి విడక
శశిభానుగ్రహములు సప్తర్షులెల్లరు
అవధిదాటక తిర్గునంబరమున
జలధులు నీ యాజ్ఞజగముల ముంచక
చెలియలి కట్టను చేరవెరచు
కలిదోషమునజేసి మలిన మానసునౌట
ధర్మశాస్త్రములెల్ల తప్పయనుచు

తే॥ వేదములకపార్థంబులు వేరెదెలిపి
భాగవతధర్మ పద్ధతుల్ పారద్రోలి
నాశమొందుచునుంటివి నన్నువిడక
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ దారేషణము జూడదగు పక్షులందున
మక్కువగా జంట మరులు కొనును
ప్రపేచ్ఛయది సర్పరాజుల యందుండు
నిధినాశ్రయించుచు నిలుచునెపుడు
పుత్రేషణము జూడపుడమి గోవులయందు
కనిపించు మక్కువ ఘనముగాను
ఈషణత్రయమందు నేదియు వదలక
కాంక్షించు నరుడు తా కాముమొంది

తే॥ ధరను నైహికమస్థిర ద్రవ్యములను
తృణముగానెంచి నారాయణుని దలంచి
నిత్యకైంకర్యమాశించ నిలచినాను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ ధర్మంబు నాల్గు పాదంబుల నడచెను
కృతయుగ మందెందు వెతలు లేక
మూడు పాదంబుల ముఖ్యమౌ ధర్మము
త్రేతాయుగంబున ప్రీతి నడచె
రెండు పాదము లోచు నుండును ధర్మంబు
ద్వాపరంబుననట్లువాసి గాంచె
ఏక పాదము ధర్మమీరీతి నుండగా
కలియుగంబున నెందు కలహ మొందు

తే॥ జారచోరత్వమవినీతి జవము గల్గి
ధర్మచింతయు భక్తియు ధర నశించు
కలియుగంబందు నన్నింక కరుణనేలి
అందుకోనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ నా మనో భ్రమరంబు నాథ నీ శ్రీపాద
తీర్థంబపేక్షించు దిన దినంబు
జిహ్వా కీరంబులు చింతించు దేవర
తళియ ప్రసాదంబు తమిని గోరి
నేత్రచకోరముల్ నీ ముఖ చంద్రికల్
సేవించ నాశించు చిరము గాను
అడియని చిత్తంబు హరి దివ్య తిరుమేను
సౌందర్య మీక్షించ చలము సేయు

తే॥ దాసుడను నాదుఅవయవాల్ దాస్యసేవ
చేయ గోరుచునున్న విశ్రీనివాస
మనసుస్థైర్యంబు నొసగురమాసఖుండ
అందుకోనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ పంకేరుహాక్షనాసంకటంబులు బాప
గరుడవాహన యేల కదలి రావు
మొర నాలకించవా మును గోపికలు పేద
నేడేల వినవు నా నేరమేమి
ప్రియ మొనరించవా ప్రేమ కుచేలున
కృపియుండని నాకు అంత విడకు
దరి జేర్చవా నన్ను తనయుని గాపాడ
భారమా నొకడను భక్త పోష

తే॥ భువనములనెల్ల నేవేళ గావలేదె
నేడు నను గావకుండిన నిందరాదె
కరుణ జూపుము కడసారి కాంక్ష తోడ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ పరుల సొమ్మును జూచి బాధ జెందుటకన్న
పరమాత్మ నినువేడ పరమ సుఖము
పరుల భోగము జూచి భోరునేడ్చుటకన్న
వరదనిన్ గొల్చుట పరమ సుఖము
అన్య సంపదజూచి అలమటించుటకన్న
అఖిలాండపతి గొల్వ యమరు సుఖము
అన్య దేవతలను యాశ్రయించుటకన్న
లక్ష్మీవల్లభు సేవ లక్ష సుఖము

తే॥ ఇట్టి సుఖములుచేపీడి యిహముగోరి
చెడుట నిక్కంబు సౌఖ్యంబు జెందగోరి
నిన్నెభజియింతు నేవేళ నిక్కముగను
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ|| దాసుని దోషముల్ తరచుగా వినవయ్య
విని నన్ను మదిలోన వెట్టియనకు
వినయంబులవి నక్క వినయంబులగుదేవ
జపము లెల్లను బక జపము లౌను
మర్కటచేష్టలు మానగలేదెందు
శీలంబు మార్జాల శీలమరయ
శునక వాలము వోలె మనసెందు నిలువదు
హృదయంబు కత్తెరై బాధ పెట్టు

తే|| గోముఖంబును గలవాడ క్రూర పతిని
ముష్టి పండును బోలు ముఖముజాడ
దుర్గుణంబులు నివిగాంచి దుష్టుడనక
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ|| బలు రోగములకెల్ల పరమౌషధంబిది
పాతకంబుల బాపు భళిరె మందు
దైత్యుల హతుజేయుదండి యౌషధమిది
మునులెల్ల పఠియించి మురియుమందు
ఐశ్వర్య మొసగెడి అందమౌ మందిది
పాముకాటును మాన్చు భారి మందు
భక్తులు జీవించ భవ్య యౌషధమిది
దుష్టులు నశియించు దొడ్డ మందు

తే|| పెద్దలాచార్యులెల్లరు ప్రీతి గొనెడి
అదియె అష్టాక్షరవి యెడి యాది మందు
దీని సేవించి సుఖియింతు రను దినంబు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు||

సీ॥ తనయుడు తండ్రివిధంబు సంబంధంబు
జీవేశ్వరుల బంధమవనియందు
రక్ష్యరక్షక భావరమ్యమౌ బంధము
నారాయణునకును నరునకెపుడు
శేషశేషిత్వముల్ చేతనేశ్వరులకు
చెలువుగా బంధమై నిలచియుండు
భర్తృభార్యాబంధ పావన బంధము
పరమాత్మ నాత్మకు పరుగు నెపుడు

తే॥ ఆత్మయాత్మీయ బంధంబు [illegible]
నవ విధంబుల బాంధవ్య[illegible]
వాడె నీవౌట విన్నింక వ[illegible]లేదు
అందుకొనవయ్య శ్రీరామ వందనములు

సీ॥ చంచరీకము తేనె యంచితంబుగ గ్రోల
పరువెత్తు మందార పాదపముకు
గాక వేమును గ్రోల కడు నుత్సహించునే
కమలాక్ష నాయాత్మ కలత లేక
నీ పదామృత చింత నెమ్మి మానసమందు
లగ్నమై యితరంబులకును జనదు
సామి మతి భ్రమ జరుగకుండగ బ్రోచి
కాపాడు మేవేళ కరుణ తోడ

తే॥ దాసు యీ కోర్కె దీర్చంగ తగును నీకు
జనని సీతామ తల్లితో సరగ వచ్చి
మంగళా శాసనము జేసి మమత తోడ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ జిల్లా కరీంనగర్జిల్లు తాలూకాగ
పరిఖ్యాతిగనె నందు పర్లపల్లి
అందు తిరోఁగవలూరనబడు వంశాన
పుట్టితి నాపూర్వ పుణ్యమునను
దేశికాచార్యులు లక్ష్మి ధీయుతుల్ పితరులు
సద్వైష్ణవులు వేదశాస్త్రమతులు
రామానుజాఖ్యుడ రమణి తాయారును
చేపట్టి తలిదండ్రి సేవజేసి

తే॥ పుడమి సధ్యాపకుని వృత్తి బూనిదేవ
భక్తిచే మిమ్ము దర్శించ భజన జేతు
ఎట్లు దరిజేర్చి రక్షింతో యేమొ సామి
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

సీ॥ సీస పద్యములిదొ శ్రీరామ మాలగా
గూర్చి మీ కొసగితి కొదువలేక
శత పుష్ప మాలిది సంతసంబున గొని
దంపతుల్ ముదమొంద దాల్చరయ్య
తావివిందిన పూల దండలివి మెడదాల్చి
చెడిపోవకుండగ జేయరయ్య
మీద దాసుండిచ్చు ప్రేమ కానుక గొని
మంగళంబులు సామి మాకు నొసగు

తే॥ గుప్పిడిపూలంచు నిర్గంధకుసుమమనుచు
మనసు నందున రోయక మణిసరాల
టంచు రామానుజుండిచ్చు హారమిదిగొ
అందుకొనవయ్య శ్రీరామ వందనములు॥

-: శ్రీ రా మా ర్ప ణ మ స్తు :-






టి. శ్రీరామానుజ[illegible]

జననం : 1920 [illegible] శ్రావణ శు [illegible]

విద్య : H.S C., S.G.B.T

రిటైర్డు టీచర్

సంగీతంలోను, జ్యోతిష్యంలోను ప్రవేశముంది.

అధ్యాత్మిక చింతనలో కాలక్షేపం చేయడం వీరి నిత్య చర్య

# శ్రీరామ శతకము

1984 వెల 10/-

శ్రీ లే ఖ సా హి తి